# ఆంజనేయ దండకము



శ్రీవాయుపుత్రా! శరచ్ఛంద్రగాత్రా! మునిస్తోత్రపాత్రా! త్రిలోకైకమిత్రా! పవిత్రా! నిన్నుఁ బ్రస్తుతింపంగ నేనెంతవాఁడన్ మహాధైర్యవంతా! దయాశౌర్యవంతా! హనూమంత! నీదాసదాసుండనై రామభక్తుండనై భక్తియుక్తంబుగా దండకంబొక్కటిన్ జేసి నీకున్ సమర్పించెదన్; దప్పులన్ సైచిమన్నించి నన్నేలుమో నాథ

కైచింతామణీ! ధీమణీ! తొల్లిసుగ్రీవునకున్ బంటవై ఋష్యమూకా
ద్రిపై భక్తిమైనంగదాదుల్ భజింపంగనీవుండ నయోధ్యానాథుం
డు శ్రీరామచంద్రుండు ధాత్రీసుతాన్వేషణార్థంబుగాం దమ్ముండౌ
లక్ష్మణుంగూడి తత్ప్రాంతముల్ చేరంగా వారికన్నారంగాంచి సుగ్రీ
వుండంత నీ భీతిల్లియా యంజనీనందనా! చూడుమా రాకుమారద్వ
యంబెవ్వరో? యేమి కార్యార్థమై యిందువిచ్చేసిరో? పోయిమెల్లం
గా వారాప్తుకేల్బోయితో వారిదర్శించి వృత్తాంతమెల్లన్ విచారించి ర
మ్మా యనం దక్షిణంబేగి నీబుద్ధికౌశల్యముంజూపి శ్రీరామసుగ్రీవ
సఖ్యంబవార్యంబుగా నగ్నిసాక్ష్యంబుగాంగూర్చి సుగ్రీవుండిష్కింద
కున్ రాజుఁజేయించి యాపిమ్మటన్ రామకార్యార్థమై పైనక్షో
యింమనం దెందునన్ జానకింగానకా వెన్క సంపాతి చేఁబ్రక్కి కంఠంను
వైదేహిఁగాంపోవు వృత్తాంతమాలించి యేవానరుల్ దాటఁగాలేని,
వారాశివేవేగలంఘించి యాసింహికాలంకిణీ ముఖ్యదైత్యాంగనా

గర్వసంహారముం జేసి లంకం బ్రవేశించి కింకంబుతో లంక నిశ్శంకన
ల్యంకలం జూచి వైదేహి కన్పింపకుండంగ సంకేసి దుఃఖించి యాపై
నశోకావనీజావృతంబౌ వనంబందు సీతామహాదేవి దర్శించి యానం
దమింపొందఁగా నంగరంబిచ్చి శ్రీరామవృత్తాంతమెల్లన్ నివేదించి
యాతల్లితో కొంత భాషించి వేవచ్చి లీలన్ వనం బెల్ల నిర్ధూమధామం
బుగా వించి కావున్న రాత్రించరశ్రేణి మాలింప, కాలాస్త్ర రుద్రుం
డో కోనాఁగ నత్యాగ్రహాయత్తుఁడై రావణుండక్షయుం బిల్చి నీపైకిఁ
బంపింప వానిన్ నిమేషంబునన్ రూపుమాపంగ నయ్యింద్రజిత్తుండు
బ్రహ్మాస్త్రముం వేసి నిన్ వేగఁ బంధించి యా రావణుండున్న యచ్చో
టికిం గొంచుఁ బోవ న్ తద్దైత్యనాథుండు సింహాసనాసీనుఁడై యున్న
వీక్షించి దైత్యేంద్రు కంఠంబున వాలంబు చుట్టుగా, దేహముం బెంచి వా
లంబు పీఠంబుగాఁ జేసి కూర్చుండఁగా రావణుండంత కోపంబుతో
వానరా! నీవు నాలంకకున్ రాఁగతం బేమిరా? నీదు పే రేమిరా? ని

యాలించు నేవాయుపుత్రుండ శ్రీరామభక్తుండ నారామభూపా
లుఁడుర్వీసుతంగాంచి రమ్మంచునన్ బంపఁగావచ్చితిన్; క్రూరమారా
ములో వద్దురా; క్రోటతో తాటకం జంపె రా; యాసుబాహులన్ మహా
నీచమారీచునింగూల్చెరా; భార్గవుంగెల్చెరా; నిన్ను బంతంబుతోఁబ
ట్టి వస్త్రాభులన్ గూంచి కారించునవ్వాలినంచత్ప్రభాశాలి నొక్కమ్ము
తోఁగూల్చెరా; యోరిరాత్రించరా! యేలరాగర్వమున్ మానరా;
నీవ్రిగల్భంబిఁకంజాలురా; చోరవృత్తిన్ ధరిత్రీసుతం దెచ్చినావేమి
న్నుపాలించువాడెవ్వఁడో చెప్పరా? యంచుగర్జించ నాథాటికిన్ ని
ల్చి ధైర్యంబు రెట్టించి యోరావణా! శాంతముంబూని నామాట
శౌర్యంబురా? వేగసీతామహాదేవిఁ గొంపోయి శ్రీరామపాదాబ్జ
సాన్నిధ్యమందుంచి సాష్టాంగదండప్రణామంబులం జేసి రక్షించు
మంచెంతయున్ దీనతన్ వేడరా? యన్ననప్పంక్తికంఠుండు రుద్రుం
డు బోలెన్మహాకాద్రిమంబూని మంతుల్ హితుల్ బాంధవుల్

లోకులుగాఁగల్గు రాత్రించరశ్రేణి వైళంబరావించి యీకోతినీచోకు
లన్ వింటిరా? కీర్తిలేశంబు లేకిట్లు నాలంకలోఁజొచ్చి నావుత్రునిం
జంపి నాతోడ నీతివాదింపఁగాఁ జొచ్చె నీతుచ్ఛుఁడిం వెంటనే కాలు
ప్రోశ్వేరఁగాఁబంపుడీ యన్న నావర శిక్షంబానుజుండన్న కుర్ణ భక్తి
తోమొక్కి యోరాక్షసాధీశ్వరా! విన్నసంబాళ్క టాలించుమీ!
దూతలంజంపగా రాదునుమ్మీ! మహాజ్ఞానయుక్తుండవీరీతి దుర్నీతికిం
బాల్పడం జెల్లునా? యింతకోపంబు నీకేల శాంతింబు నవ్వంతంబు నం
బూని యీకోతివాలంబుఁగాల్పించుమూ; అద్దియేయుక్తమౌశిక్ష;
నారావణుండెల్ల దైతేయులంజూచి మీరందఱీవానరుంబట్టి వాలం
బునం దైల సిక్తంబుగా కోకలంజుట్టి ముట్టించుడీయన్న వారట్లు
గావింప తద్వహ్నికీలాయుతంబైన వాలంబుతో లంక దగ్ధంబు గావిం
చుచుండంగ కీర్తిల్లియుండందు బక్షులు వారుంగటా! యేమియీరీతి
కష్టంబు ప్రాప్తించెనంచేడ్చువారున్, అయో! పిల్లలే మైరొయంచుం

బ్రిలాపించుతల్లుల్, తగందల్లులంగాన కెంతేని దుఃఖించుపిల్లల్, క
నుల్ గానరాకుండ వ్యాపించుధూమంబులుఁ మంటలుంగల్గిలంకాపు
రంబెల్ల నిర్ధూమధామంబుగాఁజూచి హా! పంక్తికంఠుండు సీతాత్మ
జై శ్రీరాఘవకిందెచ్చి కల్పించె మాకిట్టిపాట్లంచు నెంతేని చింతించు
రైతీయులఁ జూచుచున్న వృషుం గాంతుచుం దాటుచుం వచ్చి వారా
శిలోఁదోఁక చల్లాప్పి యామీద సీతామహాదేవి దర్శింపఁగా నామె
సంతోషితస్వాంతయై చాలదీవించి వేపోయి శ్రీరాముతో నామె వృ
త్తాంతముం జయ్యనం దెల్పుమాయంచు బాధించఁగా వెంటనే పైన
పైవారిధిం దాటి యాజాంబవన్ముఖ్యులంగూడి సుగ్రీవునారాముముం
జేరి యాతోటలోఁజాలఁగా నల్లరల్ సేయ నావానరసుగ్రీవుఁడాలిం
చి వేవేగనే తెంచి వృత్తాంతమెల్లం విచారించి నిన్గాంచి హర్షిం
చి రావయ్య హనుమంత! ప్లవగేశ వంత! రాకేందు దివ్యద్యశోవంత!
ధీమంత! యంచుం బ్రశంసించి యేమారె శ్రీరామకార్యంబనన్ రా

సుగ్రీవస్వామికి ప్రీతిలం గాంచి సాష్టాంగదండప్రణామంబు లర్పించి
తా వారధిం దాటి లంకాప్రవేశంబు గావించుటల్ మున్నుగాఁగల్గు
వార్తల్ సమగ్రంబుగాఁ దెల్పి యామానవాలియ్యఁగా రాముఁడం
దుకొండహా పిరహన్మంత! నీశక్తికిన్ బుద్ధికిన్ మెచ్చితిన్ నీదు శౌ
ర్యంబు ధైర్యంబు నెవ్వానికిన్ లేదు నిక్కంబు వాతాత్మజా! యింక
గానున్న కార్యంబు యోచింపుమా యన్న వారంద ఱింగూడి శీఘ్రము
బుగా వారధిం జేరి వేవేగఁ గొల్లఁగాఁ గొండలం దెచ్చి యవ్వార్ధి
బంధించి లంకాప్రవేశంబుఁ గావించి యుద్ధంబులో దైత్యులం పెక్కు
రం గూల్పఁగా రావణుం డుగ్రుఁడై ఘోరశక్తిం బ్రయోగింప నాశక్తికిన్
లక్ష్మణుండుర్వి మూర్ఛిల్లఁగా నీవు సంజీవియుం దెచ్చి సౌమిత్రి రక్షింపఁ
గా నక్కటా తప్పె కార్యంబటంచున్ దశగ్రీవుఁ డామీద పాతాళహో
మంబుఁ గావింపయత్నింపఁగా వేంటవేపోయి యాహోమభంగంబు
గావించి చూపింప్మటన్ శీఘ్రమే రాముచే రాక్షసాధీశుఁ జంపించి జేజే

ఉపహ్లింపఁగా జానకిన్ రామస్వామితోన్ వేగనయోధ్యకుం దె
చ్చి శ్రీరామపట్టాభిషేకంబుఁ జేయించి యారాముచేసీతచే నన్ని
యోమన్ననల్ బొంది పేర్గొన్న యోమారుతీ! నాకునీకన్న దైవంబు
లేరెందు లేకుంటసత్యంబు నేనమ్మితిన్నీదు పాదంబులే, యెట్లునన్
బ్రోచెదో యేగతింగాచెదోనీదె భారంబుసుమ్మా జగత్పుణ్యమూ
ర్తీ! మహారమ్యకీర్తీ! పవిత్రప్రవర్తీ! యిదేవంగనంబంధమోభర్తీ
మందార! యోపుణ్యసంచార! యోవార్ధిగంభీర! నీపేరువిన్నంత
నేభాగ్యముల్ గల్గుసామ్రాజ్యముల్ గల్గుసౌఖ్యంబులుం గల్గునిన్నుంస్మ
రింపంగ నాశాకినీఢాకినీ కామినీ ముఖ్యభూతంబు లొక్కింతయుం
జేరఁగాలేవుగాయెట్టి యిక్కట్టులున్నట్టి కష్టంబులుం గల్గఁగాఁబో
వుగా; అట్టినిన్నిప్పుడున్ నమ్మితిన్ నమ్మిసేవింతునన్ బ్రోవుమోదేవ!
పాలార్ధివాసా! దయాంధీవిలాసా! సముద్యత్ప్రకాశా! మహాభక్త
పోషా! నమస్తే! నమస్తే! నమస్తే! నమః॥

